శ్రీ సద్గురుపరబ్రహ్మణేనమః.

పరమార్థ దర్పణంబను

# గురువర్య శతకము.

ఇది

## కడలి ఆదినారాయణచే

రచియింపఁబడి

అనుపోజు వెంకటాచార్యులవారిచే బరిష్కరింపఁబడి

గ్రంథకర్తచే ప్రకటింపబడియె.




సీతారామాంజనేయ ముద్రాక్షర

ఏలూరు

1922.




[వెల రు 0—2—0.



శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః.

పరమార్థ దర్పణంబను

# గురువర్య శతకము.

క. శ్రీమించు నట్టిచరితం
బీమహిసజ్జనులకెల్ల నింపుదలిర్పన్
బ్రేమించి చెప్పబూనితి
స్వామీ ! నను బ్రోవుమయ్య సద్గురువర్యా. 1

క. ముందుగ మీపాదములకు
వందనమొనరించి పిదప వరకవులకునే
నందముగ పూజజేయుచు
కందములను జెప్పదలతు గదగురువర్యా, 2

క. శ్రీమద్విజయ నగరమున
క్షేమంబున నిలచియుండి క్షితితలమందుర్
భావాతీతము దెలుపగ
దేవర ! కంకణముఁ దాల్చితే గురువర్యా. 3

క. అనుపోజు వంశసాగరు
డనదగు మూర్తియనునారి కనుగుణసతియా
ఘనసంకమాంబయను నా
వినయునిధునమునకు తనయ విభు గురువర్యా. 4

# పరమార్థ దర్పణము.

క. పొంకముగ మిమ్ముదలచిన
సంకటములు బారదోలి సద్గతినొసగే
వెంకట రత్నాంకితమగు
శంకరమము బ్రోవుమయ్య సద్గురువర్యా 5

క. అనుపోజు వెంకటాఖ్యుం
డని యెన్నుదు రవనియందు నఖిలజనంబుల్
ఘనబోధన పరుడనదగు
మనమున నినుదలతుమయ్య సద్గురువర్యా. 6

క. విశ్వకర్మాంత్య సుతుడగు
దిశ్వజ్ఞబ్రహ్మ వంశవోద్భవ పరుడున్
విశ్వబ్రాహ్మణుడును స
ర్వేశ్వర భక్తుడనుతండ్రి సద్గురువర్యా. 7

క. కడలిసన్యాసి యందురు
పుడిమిని తననామధేయము పొందిక దెలియన్
కడుసుగుణమైన జనకుని
తడయక నేదలచుచుందు ధరగురువర్యా. 8

క. సన్యాసయ్యను జనకుని
పుణ్యాంగన పైడిమాంబ పేరనబరగే
అన్యోన్య దంపతులకును
ధన్యుడనై యుద్భవిస్తి ధరగురువర్యా 9

క. జననీ జనకులకును నే
నను కూలపు పుత్రమపుత్రుడను నామంబుగా
మునుముందు పద్యమందున
వినుమని నే విన్నవింతు నో గురువర్యా. 10

క. ఆదినారాయణుండని
మేదిని నానామధేయ మేర్పడియుండెన్
సాధులకు దాసుడను స
న్నాదరమున బ్రోవు మయ్య హరగురువర్యా. 11

క. మీపాద చరణసేవయు
నేపారగ జేయుచుందు నిర్మలమతితో
నాపాలి దైవరాయుడ
కాపాడుము నాదుకృతిని ఘనగురువర్యా. 12

క. ఛందమును చదువనెరుగను
అందముగా మనసుమీదు అద్భుతచరణం
బందున లిఖించితి నిది
సందేహము లేక దేవ సద్గురువర్యా. 13

క. ఛందముగల సుకవులుగని
పొందుగ దీనందుగలుగు పూర్ణాంశముకున్
పొందిక చెడకుండగనీ
కందములను దిద్దవలయుగద గురువర్యా. 14

క. సారాంశ మెరుగకున్నను
ధీరతగా పద్యపఙ్తి దిద్దుటకంటెన్
సూరకయుండుట మేలని
సారెకు నేజెప్పుచుంటి సద్గురువర్యా. 15

క. అక్షయమగు నీబోధను
వీక్షించిన శుకవులెల్ల వేడుకతోడన్
కుక్ష్యందు సంతసింతురు
మోక్షార్థం బిదియటంచు సద్గురువర్యా. 16

క. తెనుగున వ్రాసితిననుచును
ఘనులెంచక దీనిగల్గు ఘనమునుగనరా
అనువైన స్వర్ణమెచట
నునిచిన దొంగిలి కనుమానునే గురువర్యా. 17

క. ఆరీతిని దీనింగల
సారాంశము జూచిబుధులు సమ్మదమొందన్
చేరిపద భిన్నమున్నను
వారెన్నరు వసుధలోన వరగురువర్యా. 18

క. నామీాది ప్రేమచేతను
ధీమతులకు దెలియగలుగు దివ్యతరంబౌ
స్వామిని గనుమని దెల్పిరి
పామరులకు ముక్తినిదియె వరగురువర్యా. 19

క. అగణితమగు మీభావము
సగుణాతీతులకుగాక సగుణుల కెల్లం
దగ తెలియ తరముగాదని
సుగుణాత్ములు జెప్పగలరుసుమీ గురువర్యా. 20

క. పునరావృత్తి తొలంగుట
కనయము మీసేవకంటె నన్యముగలదా
సనకాది మునులకంటెను
ఘనుడవుగద నిజముదెల్పగా గురువర్యా. 21

క. భావించి చూడనీవే
దేవుడవని దలచవచ్చు ధీయుతులకు నీ
దేవరహస్యము దెల్పగ
నీవలెగద నిజముదెలసెనో గురువర్యా. 22

క. నిజగురుబోధను చెందిన
విజయంబును పొందవచ్చు వేడ్కతో వినుమా
సుజనుండగు సద్గురువును
భజియించుట శిష్యునకును పనిగురువర్యా. 23

క. గురుమూర్తి యున్నచోటును
ధరదివ్యక్షేత్రములని దలచగవలె
నాగురుచరణ తీర్థమెప్పుడు
వరపుణ్య నదీజలంబు వరగురువర్యా. 24

క. గురుమూర్తి సత్యదైవము
గురుమూర్తియె దాత దొరయు గురుడే హరుడున్
గురుడే జననీ జనకుడు
నరులిట్లుగ దలచవలయు నయగురువర్యా. 25

క. గురుమూర్తికన్న నధికము
పరికింపగ నొకటిలేదు పరిపరిగతులన్
గురుచరణ సేవజేయుచు
సరగున కడతేరవలయు సద్గురువర్యా. 26

క. కపటంబగు శిష్యులకును
ఉపమానా తీతమైన ఉనికి తెలియదే
చపలంబు జెందిపిదపను
ద్విపదంబుల పశువనంగ విధిగురువర్యా. 27

క. తనువు గురుమూర్తికొసగియు
సనకాదులు దెలియునట్టి సన్మార్గంబున్
గనుగొనుచుండిన చాలును
ఘనశోధా పరుడువాడె గదగురువర్యా. 28

క. మానసమందున మిమ్మును
ధ్యానించుచు నుందునెపుడు దీనశరణ్యా
నానోము ఫలముగావలె
మీనా సంపర్కమునకు మితిగురువర్యా. 29

క. అహాహా నీదు ప్రభావం
బహిశయనుడు రుద్రు డింద్రదఖిల గణములున్
వహావ్వా యటంచు మిమ్ముల
బహుగతులను బ్రస్తుతించబడు గురువర్యా. 30

క. గర్వంబును విడనాడియు
నిర్వాణ పదంబుజెందు నిర్మలమతికిన్
యుర్వీస్థలంబునకుగల
సర్వరహస్యములు దెలియు సద్గురువర్యా. 31

క. సజ్జనులగు మీచేతను
రజ్జువుసర్పంబు లోకరాకడ యనుచున్
బుజ్జగిలి యుండునెప్పుడు
మజ్జనకుడ వరయనీవు మద్గురువర్యా. 32

క. మీరానతిచ్చు రీతిని
మారక నిలచున్నయట్టి మాన్యులకెల్లన్
భూరిపరిభావము గలిగియు
ధీరుండైె నిలువవచ్చు ధీగురువర్యా. 33

క. వింతలుసేయుదు బ్రహ్మము
చింతల సంపర్కమెపుడు జెందక ధరయం
దంతట నిండిననిజమును
అంతలో నెరిగి స్థిరయ్యె హారగురువర్యా. 34

క. నిగమాగ ముపనిషిత్తుల
దగులని పరవస్తువనగ దనరెడిదానిఁ
తగనెరుగజేస్తి రహాహా
సగుణాతీతుండవయ్య సద్గురువర్యా. 35

క. పరమును గనుమని దెల్పిన
తెరగున నే దెలిసియున్న తక్షణమందే
చరరూపమగు ప్రపంచము
మఱి కనరాకున్న దేమొ మద్గురువర్యా. 36

క. అన్నిటి నెరిగెడి నేనుఁ
పన్నగయీ బ్రహ్మ మెరుగ బడునంతనె నా
కన్నులగు నాకు నేనే
తిన్నగగాన్పించ లేదు స్థిరగురువర్యా. 37

క. ప్రకృతి కలదనుచు నొకతరి
వికలంబుగ దోచె నేని వెంటనె నేనా
యకలంకముగనుగొనగా
నికరంబుగ ప్రకృతి లేదు నిజగురువర్యా. 38

క. మీరానతిచ్చు రీతిని
మారక నిజవాక్యములను మనమున నెపుడుఁ
కోరిజపించిన వారలు
చేరును కైవల్యపదవి శ్రీగురువర్యా. 39

క. అచ్చపు యీబోధంబున
కుచ్ఛిత భావులకు నెల్ల కూర్మియుగలదా
సచ్చరితులైనవారల
కిచ్ఛజనించకను విడువదిక గురువర్యా. 40

క. మొదలు లేనట్టి నాకును
మొదటను కలదనుచు దెల్పి మఱిలోకంబుల్
కదలిక రూపములనుచును
పదిలంబుగ దెల్పితివిగ వరగురువర్యా. 41

క. సంచితకర్మమువల్ల జనిం
చుచు ప్రారబ్ధమందు మునుగుచునుంటే
మించిన కార్యంబునకై
నెంచక నాగామి నెరుగుమనె గురువర్యా. 42

క. ప్రారబ్ధమను భవింపుచు
ధీరతతో గురుని జేరి దివ్యతరంబౌ
సారముగని ఆగామిని
చేరకుమని జెప్పినట్టి స్థిరగురువర్యా. 43

క. కర్మే జన్మకుమూలము
నిర్మలమగు నీదుపాద నీరముచేతన్
కర్మజననములు బాపియు
ధర్మయశస్సును వహించెదవు గురువర్యా. 44

క. మాటకు మూలము లేకను
మాటలనేకములు గలిగి మాయగు రీతిన్
చేటొందునట్టి లోకము
పాటిదియని దెలుపబడియె భళిగురువర్యా. 45

క. మీనా నిర్ణయమునకును
నేనను తనువొకటిదక్క నితరముగలదా
మానాభిమానములుగల
దీనినివిడిపించునట్టి ధీగురువర్యా. 46

క. అస్థిరము చిజ్జడంబులు
సుస్థిరమే బ్రహ్మమగుచు సొంపుదలిర్పన్
బ్రస్తుతమె తెలియజేస్తిరి
మస్తకమున చెయ్యిజేర్చి మద్గురువర్యా. 47

క. నాస్తికులు చూడజాలక
వాస్తవమిది కాదటంచు వాదింతురిలన్
అస్తిపదార్థంబిదియని
చూస్తినయా మీదుకరుణచే గురువర్యా. 48

క. మొందఱు లేదనియన్నను
ముందుగ గాన్పించుచుండు ముదమున చూడన్
అందటి మాటలచేతను
సందేహము లేదుదేవ సద్గురువర్యా. 49

క. యెక్కడజూచిన పూర్ణము
చక్కగ గాన్పించుచుండె సాక్షియు లేకన్
నిక్కముగ నిలచియున్నది
వక్కవిధంబుగ పరంబు వరగురువర్యా. 50

క. దీనందు ఇంద్రజాలము
యేనాడును గలుగ లేదు యింపుగ వినుమం
చానాడు తెలియ జేసిన
దీనాటికి దెలియబడిన దే గురువర్యా. 51

క. సంతతము జగముకలదని
యెంతురు మానవులు భువిని యెల్లవిధములన్
అంతంతలో గల తొలకరి
వింత మెరుపురీతి దీనివిధి గురువర్యా. 52

క. మొదలు లేనట్టిజాలము
కదలికయగు ద్రష్టయందు కల్పనయయ్యెన్
పదిలమగు పరముజూడగ
కదలిక జగమెందుబోయె గదగురువర్యా. 53

క. అహాహా జగము ప్రభావము
వహావ్వాయగు నింద్రజాల వైభవమెగదా
బహుకాల బ్రహ్మమెరిగిన
నహియయ్యె జగంబు నపుడె నయగురువర్యా. 54

క. లేనిజడాజడ మెప్పుడు
లేనిదెయని నిజము నెరిగి లేనిది లేకఁ
పూనికతో నిలచియుండిన
నేనెన్నడు రానుపోను నిజ గురువర్యా. 55

క. చూచెడి చూపులచేతను
నీచానీచములు లేక నిలచినదానిఁ
జూచి చూపొదలియుండిన
ధీచాతుర్యుండు వాడు ధరగురువర్యా. 56

క. ఆకార రహితమైనది
లోకాంతర్బాహ్యములగు లోపల వెలియుఁ
జేకొని నిండినపూర్ణము
నాకెదురగ యున్నదదుగో నయగురువర్యా. 57

క. దీనందు నేను లేకను
నానారూపంబులగుచు నాతో నేనే
దీనెరిగినపుడు నేగుదు
రేనాటికి నేనునిల్వకను గురువర్యా. 58

క. వెనుకటి నా తెరగెల్లను
గనుగొన నత్యద్భుతంబుగా గనవచ్చెఁ
యునికి నెరింగినపిమ్మట
అనుకొనుటకు నేను లేను నా గురువర్యా. 59

క. పరమార్థము గనువారికి
చరరూపము గానరాదు స్థిరముగ వినుమం
చెరిగించి యున్నరీతిని
పరిశీలించితిని వేగ ప్రభుగురువర్యా. 60

క. కలయంటిరి జగమెల్లను
తెలసెను మీబోధచేత తెల్లమిగాగన్
మెలకువయగు పరమందున
నిలలేదని నమ్మవచ్చు నిజగురువర్యా. 61

క. త్రిపుటికి మధ్యస్థంబున
విపరీతపుకాంతిచేత వెలసిన బయలున్
అపవాదు లచలమందురు
చపలాత్మని దలచలేక శ్రీగురువర్యా. 62

క. ఒకతత్వమందు బయలుగ
నొకతత్వము గగనరీతి నొప్పుచునుండెన్
నొకతరి జ్యోతిగ వెలుగుట
వికలాత్మకు చపలగుణము విధిగురువర్యా. 63

క. కెంపుతరి నేనెరుంగను
కుంపటివలె నుందునెడి కుజనులరీతిన్
సొంపగు మార్గము పరిశీ
లింపని దుర్జనులబోధ లవిగురువర్యా. 64

క. మెచ్చరు నిజగురుబోధను
తుచ్ఛపు బోధలకు మనసుదూరునదెట్లన్
హెచ్చైన కొలను జలముకు
వచ్చునె వాయసము భువిని వరగురువర్యా. 65

క. మురుగుడు కాల్వల జలమును
స్థిరముగ వాయసము గ్రోలు తెరగునజూడన్
కొఱగానిబోధలకు తా
నరుగును దుర్జనుడు వేగ నయగురువర్యా. 66

క. దుర్గంధపు వ్రణములకు న
నర్గళముగ మక్షికంబు నానందించున్
దుర్ఘటమైన సుగంధపు
నర్గను గనజాలదయ్య సద్గురువర్యా. 67

క. మక్షికమురీతి కుమతులు
వీక్షించగ దలచరిట్టి విమలార్థంబున్
చెక్కులలోగల ప్రకృతిని
దీక్షలచే దలతు రెపుడు ధీగురువర్యా. 68

క. శిష్టజనంబులు దీనిని
స్పష్టంబుగ దెలియగలరు పరికింపంగా
నష్టములేకను వారల
కష్టంబులు దొలగియుండెగద గురువర్యా. 69

క. పరమార్థమునకు నామము
పరికింపగ మొదటలేని పద్ధతివినుమా
గురుశిష్య రూపమొందిన
యెఱుకవలన పేరుగల్గెనో గురువర్యా. 70

క. పరమార్థము చరరహితము
గురుగుహ్యము పరమపదము గోప్యంబను నీ
పరిపూర్ణమునకు నామము
కరువలిచే జెప్పబడియెగద గురువర్యా. 71

క. కరువలియన మాయనినను
ధరయనిన ప్రపంచమనిన ద్రష్టంచనిన్
చరరూపమనిన ప్రకృతన
విరివిగనివి యెరుకపేళ్లు విధిగురువర్యా. 72

క. యెఱుకన మూలములేనిది
పరికింపగ స్వప్నమందు పలురూపములన్
బిరబిరగాన్పడి మెలకువ
బరతెంచిననేమిలేదు ప్రభుగురువర్యా. 73

క. కలలోగలగిన సర్వము
మెలకువలో నేమిలేక మాయగురీతిన్
కలజగము బయలుగాంచిన
నిలువక తానేగుచుండు నిజగురువర్యా. 74

క. యెందున్ జనినదొ యనుటకు
ముందెన్నడులేక ఉత్త మోహినిరూపై
సందేహ మొందజేసెను
పొందుగ లేనట్టిమాయ వరగురువర్యా. 75

క. త్రాడునుముందుగ జూడక
నీడనుగని భుజగమనుచు నొసగినభీతిఁ
త్రాడును త్రాడుగజూచిన
వీడెనుపాము నెడు భ్రాంతి వినుగురువర్యా. 76

క. యెప్పుడు త్రాడై యున్నది
సర్పంబను భయము వట్టిసంకల్పంబే
తప్పక నిజమును జూచిన
అప్పుడె సందేహమణగె హరగురువర్యా. 77

క. ఆరీతిని నాకిప్పుడు
సారెకు నెఱిఁగించినట్టి సారముజూడఁ
దీరెను కోరికలెల్లను
మారాడుట కేమిలేదు మద్గురువర్యా. 78

క. ఉన్నది ఉన్నట్లున్నది
యెన్నుటకును నేనులేను యేమందును నే
చిన్నెలు లేనిది అంతట
చెన్నుగ నిలచున్నదయ్యా సద్గురువర్యా. 79

క. అదితప్ప ఇతరమెయ్యది
ముదమున జూడంగ లేదు ముల్లోకములన్
కదలిక మెదలిక లేనిది
పదిలంబుగ జూస్తినయ్య వరగురువర్యా. 80

క. లోకంబులనుట మాయే
ప్రాకటముగ సర్వదిశల పరిపూర్ణంబే
ఆకార రహితమగుచును
ఏకంబై యుండు బ్రహ్మమో గురువర్యా. 81

క. కదలని దేదో బ్రహ్మము
కదలిక పేనుమాయయనుచు ఘనులెన్నిరి యా
కదలనిది జూచినంతనె
కదలికగలనేను లేనుగద గురువర్యా. 82

క. వాటమగు బోధనామది
నాటించగ దలచెయిట్లు నానాగతులన్
చాటువల రీతిజెప్పిరి
సూటిగనే దెలిసియుంటి సుమిగురువర్యా. 83

క. రాకడ పోకడ లేకను
యేకముగా నిలచియున్నదే కైవల్యం
బాకార రహితమైనది
ప్రాకటముగ గంటినయ్య ప్రభుగురువర్యా. 84

క. అక్షయమగు నీబోధను
పక్షంబును లేకనీదు భక్తులకెల్లన్
రక్షించి తెలియజేసితి
దక్షిణమూర్తనెద నిన్ను ధరగురువర్యా. 85

క. సంకల్పముగలవారల
సంకల్పము బాఱదోలి సద్గతిగలిగే
సంకల్ప రహితబోధను
పొంకముగా గంటినయ్య ప్రభుగురువర్యా. 86

క. తుమ్మెద కుసుమంబులలో
నిమ్ముగ నమృతంబుదాగివ నేగినయట్లున్
ఇమ్మహి సద్గురుబోధకు
సమ్మదమున సుజనులరుగు సద్గురువర్యా. 87

క. పతియందు భక్తిగలిగిన
సతులకు పరులెన్ని దుష్టసంగతు లిడినన్
పతిభక్తి వదలియుండుని
మతిమంతున కదియెనీతి మద్గురువర్యా. 88

క. సామాన్య జనులుకొందఱు
నీమానస మెరుగలేక నిష్ఫలులయ్యెన్
వేమారు నిన్నుజూచిన
పామఱులకు ముక్తిగలుగు ప్రభుగురువర్యా. 89

క. ఒక్కొక్క మాటచేతను
చక్కగ దెలియంగవచ్చు సజ్జనులైతే
నిక్కమగు పూర్ణబోధకు
చిక్కులుమఱి లేనిలేవు శ్రీగురువర్యా. 90

క. రాదారి బాటయిదియని
మేదినిసత్పురుషులెల్ల మెలగినరీతిఁ
సాధుడవగు నీచేతను
మోదముతో దెలియవచ్చు మద్గురువర్యా. 91

క. అంకిలిలేనీత్రోవను
సంకోశములేక దీని సారాంశంబుఁ
పొంకముగ దెలియ జేసిన
శంకర ననుబ్రోవుమయ్యా సద్గురువర్యా. 92

క. బంగారు మూటగట్టుక
వెంగళులై డబ్బుకొఱకు వెదకినరీతిఁ
శృంగారమైన మీదగు
సంగతి దెలియంగలేక సద్గురువర్యా. 93

క. ఒక్కొక్క పద్యమందున
చక్కని అర్థంబుమదికి సరిపడకున్నఁ
తక్కినపద్యము జూచిన
చిక్కను పూర్ణాంశమెల్ల శ్రీగురువర్యా. 94

క. క్షీరము నీరముగలసిన
చేరిబకంబులు విభాగ చెర్ప నెరుగునా
క్షీరము నీరము నిప్పటి
తీరున వివరించుహంస స్థితిగురువర్యా. 95

క. ఈరీతి పద్యములలో
చేరినపదభిన్నములను చేకొనిసరిగా
కోరిసవరించ నేర్తురు
ధీరులుగద వారుభువిని ధీగురువర్యా. 96

క. ఇదియొక కథగాదనుచును
పదిలంబుగ జననమరణ భ్రాంతిదొలంగ
విధికొలకు కందములుగా
ముదమున నేజేస్తినయ్యా మద్గురువర్యా. 97

క. హితవుగ జెప్పెద నేనొక
శతకంబును కందపద్య సరణిగవినుడీ
మతిమంతులైనవారలు
సతతంబును జూతురనుచు సద్గురువర్యా. 98

క. కరికర దిగ్గజధరయను
వరుసగణితమునకు శాలివాహనశకముగ
సరియగుచు పరాభవ న
త్సరమునకుగా ముగిసెనిదియు సద్గురువర్యా. 99

## గురువర్య శతకము.

క. అందముగా సద్గ్రంథము
పొందికతో వినియు చదువు బుధజనులెల్లన్
వుందుగ పరిపూర్ణముగని
జెందును కైవల్యపదవి శ్రీగురువర్యా.

### గద్య.

ఇది శ్రీమద్వేదాంత సారుండును సచ్చిదానంద శహితుండును
ప్రకృతి ద్వయ దోషరహితుండును నాదుబిందుకళా
తీతుండును, అశరీరుండును, అచల పరిపూర్ణుం
డును, శ్రీ సద్గురు స్వామియగు అను
పోజు వెంకటాచార్యులవారి ప్రియ
శిష్యుండునగు కడలి ఆదినారా
యణచె రచియింపబడిన
పరమార్థదర్పణంబను
గురువర్యశతకము
సంపూర్ణము.

---

శ్రీ సీతా రామాంజనేయ ముద్రాక్షరశాల, పవరుపేట, ఏలూరు.